# బ్రహ్మచర్యము

[illegible]

[illegible]

గ్రంథకర్త

శ్రీ హనుమాన్ ప్రసాద్ జీ పోద్దారుగారు

అనువాదకులు

శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు

ద్వితీయ ముద్రణము

1961

ప్రకాశకులు

శ్రీ సీతారామనామసంకీర్తన సంఘము

శ్రీ రామనామక్షేత్రము

గుంటూరు

సర్వస్వామ్యసంకలితము ]          [వెల రు. 0—6—0

# తొలిపలుకు

బలహీనుల కాత్మ లభింపదని ఉపనిషద్వాక్యము. ఏ సాధన గావించినను బ్రహ్మచర్య మవసరము. శరీరములోని బలకరమైన వస్తువు శుక్లము. దానిని ధరించుట వలన బలము కలుగు. అదియే జీవనము. దానిని పతనముగావించుట వలన బలహీన మగును. అదియే మృత్యువు. బ్రహ్మచర్యము నవలంబించుట యనఁగా మరణమునుండి అమరత్వమును బొందుటయే యని గ్రహింపవలెను. శుక్లధారణ గావించిన నదియే యోజస్సుగా మారును. ఇదియే భగవత్ప్రాప్తికి మూలాధారము.

హనుమంతుఁడంతటి సముద్రమును దాటి రాక్షసులను హరించినదియు, భీష్ముఁడు అపార పాండవసేనను నిగ్రహించి చివరకు స్వచ్ఛందమరణమును బొందినదియు, శంకరాచార్యాది మతగురువులును, శ్రీ రామకృష్ణ పరమహంసాది మహాపురుష శ్రేష్ఠులును, గాంధిజీవంటి మహాత్ములును ఆ బ్రహ్మచర్య ప్రభావముననే అట్టి యుత్తమ స్థితిని బొందిరి. మన దేశమునకు బ్రహ్మచర్యమునికిపట్టుగ నుండినది. కాని పాశ్చాత్యవ్యామోహపీడితులమై, ఆర్షమత ధర్మములలో మొదటి యాశ్రమధర్మమగు బ్రహ్మచర్యమును వదలి నేలవిడిచి సాముచేసినట్లు మిగిలిన వన్నియు నభివృద్ధి పఱచుఁదలఁచుచున్నాము. ఇది పతనమునకుఁ గారణము. అసలీబ్రహ్మచర్యము కావలసిన ఆవశ్యకత విద్యార్థి దశలోనే గలదు. ఆ బ్రహ్మచర్యము బొత్తుగా మృగ్యమైనది పాశ్చాత్య విద్యాలయములలో విద్య నభ్యసించు విద్యార్థులకే.

కావుననే 'కళ్యాణకల్పతరువు' పత్రికాసంపాదకులగు శ్రీ హనుమాన్ ప్రసాద్ జీ ప్రోద్దారుగారు అందఱకును బనికివచ్చునట్లు హిందీలో నొక చిన్న గ్రంథమును బ్రహ్మచర్యమునుగూర్చి వ్రాసినారు. అది చాల నుపయోగకరమైనదని గ్రహించి నే ననువదించితిని. అట్టి యుత్కృష్ట గ్రంథమును లోకమునకుఁ బ్రసాదించిన ప్రోద్దారుగారికి వందనశతములు. సాధకులును, విద్యార్థులును దీనిని శ్రద్ధతోఁ జదివి సమగ్రముగా ననుష్ఠానములోఁ బెట్టుకొనెదరనెడి యాశయముతో మా సంఘము పక్షమున దీనిని బ్రచురించుచున్నాము.

ఇట్లు
శ్రీరామచరణపరిచరణుఁడు
కుందుర్తి వేంకటనరసయ్య.

# బ్రహ్మచర్యము

"బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యు ముపాఘ్నత"

(అధర్వవేదము)

[బ్రహ్మచర్యమువలన తపస్సువలన దేవతలు మృత్యువును జయించిరి]

ఏదేశములో ప్రతిబాలకునికి బ్రహ్మచర్య మనివార్యమో, ఏజాతియొక్క సమున్నతి జెందిన నియమితాశ్రమములలో బ్రహ్మచర్యము మొదటి ఆశ్రమమో అట్టిదేశములో, అట్టి బ్రహ్మచారులజాతియందు నేడు బ్రహ్మచర్యము అభావమగుట దుఃఖించవలసిన విషయము. ఏదేశములోని శిశువులు సింహాములతో ఆడిరో, ఏదేశములోని శిశువుల పదాఘూతముచే కొండలు పిండియయ్యెనో అట్టివీర్యవంతమైన దేశము నేడు నిర్వీర్యము, సత్వహీనమయ్యెను. నేడు దేశములోని లక్షల కొలది బాలకులు బ్రహ్మచర్యాచరణమునుండి భ్రష్టులయి యువావస్థ రాకపూర్వమే అపక్వవీర్యమును నాశముగావించి చిరకాలము బుద్ధి, తేజో బలోత్సాహములు లేనివా రగుచున్నారు. లక్షల యువకులు నానావిధ దుర్వ్యాధిపీడితు లగుచున్నారు. లక్షలకొలది తల్లిదండ్రులను నిరాధారయగు యువతియగు పత్నిని ఏడ్పించి మృత్యువువాత పడుచున్నారు. సంయమ నియమ, సాధన సుఖములకును, మనుష్యత్వమునకును భీషణ హ్రాసము కలిగినది. ఇట్టి దుర్దశాగ్రస్తమైన దేశముయొక్క రక్షణ మరల కేవలము బ్రహ్మచర్యముయొక్క పునఃప్రతిష్ఠవలననే కలుగ వలెను కాబట్టి యీ విషయమునుగూర్చి శాస్త్ర,

సత్పురుషవాక్యములచేతను స్వానుభవమునను కొంచెము వ్రాయ దలపు కలిగెను.

## —◆ మన జీవితలక్ష్యము, దాని సాధన. ◆—

ప్రాచీనఋషులు మునులు సుఖాన్వేషణము చేయుచు అనుభవమువలన, శాశ్వతసుఖము కేవలము పరమాత్మప్రాప్తి యందే గలదనియు ఇదియే మనుష్యజీవనమునకు చరమలక్ష్యమనియు, మనుష్యుఁడు ప్రపంచములోని అనేకత్వమునుండి వ్యాపకమైన ఏకత్వోపలబ్ధి చెందనంతవఱకు వానికి దుఃఖము నుండి ఆత్యంతికనివృత్తి లేదనియు, అట్టి నిత్యశుద్ధ బుద్ధసచ్చిదానంద ప్రాప్తికొఱకే తత్కృపవలన నీదేవదుర్లభమానవదేహము ప్రాప్తించెననియు నుడివిరి. కాని అది సులభముగ ప్రాప్తించు నెట్లు? అందువల్లనే మనుష్యులు ప్రపంచమున నేవిధమైన బాధ లేకుండ, క్రమముగ ముక్తిమార్గమున దృఢముగా ముందుకు పోఁగలుగులాగున నాలుగాశ్రమములను ఏర్పఱచుకొనిరి. ఆరంభమునుండి ఆర్యబాలకుని హృదయమునందు బ్రహ్మప్రాప్తియను లక్ష్యము స్థిరమగునటు సంయమనియమ పూర్వకముగా నుండి ఆప్రకారముగా శిక్ష బొందునట్లు వ్యవస్థ నేర్పఱచిరి. కాఁబట్టియే మొదటియాశ్రమముపేరు "బ్రహ్మచర్యము" ఆయెను. ఈయాశ్రమ క్రియ లన్నిటిని పూర్తిగావించిన తేజస్వియగు నాయువకుఁడు బ్రహ్మచర్యము యొక్క కఠినపరీక్షలో నుత్తీర్ణుఁడైనప్పుడు రెండవ దగు గృహస్థాశ్రమములోఁ బ్రవేశింప నధికారి యగును. అక్కడనైనను ఆయన బ్రహ్మప్రాప్తిలక్ష్యమును ధ్యానమందుంచుకొనియే, విశాలహృదయముతో స్వధర్మానుసారము

బ్రహ్మప్రాప్తికొఱకు భగవదర్పణ బుద్ధిచే సంపన్నుఁడగును. గృహస్థాశ్రమములో సమస్తాశయములను నెఱవేర్చుకొని మూఁడవదగు "వానప్రస్థాశ్రమము"నందు ప్రవేశించి యచ్చట బాగుగా వైరాగ్యము నభ్యసించవలెను. వైరాగ్యముసిద్ధించిన పిదప నాల్గవ ఆశ్రమమగు "సన్న్యాసము"ను గ్రహించి మనుష్యుఁడు దేహాభిమానమును బాహ్యవస్తుపరిత్యాగము చేసి పరమాత్మయందు లీనమగును. శతవర్షప్రమాణమున ౨౫ సం॥ వఱకు బ్రహ్మచర్యపాలనమును, ౫౦ సం॥వఱకు గృహస్థాశ్రమమును ౫౦ సం॥రములు దాటఁగానే దంపతీసమేతముగా అరణ్యవాసులై వానప్రస్థాశ్రమమును గడచి ౭౫ సం॥నుండి జీవితాంతమువఱకు సన్న్యాసాశ్రమములో నుండవలెను. ఇది నూఱు వర్షముల ఆయుఃపరిమాణమునకుగదా; ఇది యిప్పుడెందులకని కొందఱందురు. కాని అదిపొరపాటు. శాస్త్రముప్రకారము ఇప్పుడైనను ౨౫ సం॥రములవఱకు అఖండబ్రహ్మచర్యపాలనము గావించిన నిప్పుడైనను నూఱువర్షములు బ్రదుకుటలో నాశ్చర్యము లేదు. అయుఃక్షీణతకు కారణము బ్రహ్మచర్యనాశమే మన దేశములో బ్రహ్మచర్యపూర్ణస్థితి[illegible] మున్నంతవఱకు ఇన్నివ్యాధులు లేవు, యువావస్థలో నెవరును చచ్చుటయు లేదు కానినేటి దశ దానికి వ్యతిరేకముగా నున్నది. మనము మనజీవనాధారమైన బ్రహ్మచర్యమును వదలుటచేతనే మనకీ దురవస్థ కలిగినది. మన దేశములో బ్రహ్మచర్యము మరల ప్రతిష్ఠింపఁబడనంతవఱకు మన కభ్యున్నతి కలుగుట దుర్లభమనునది జ్ఞాపకముంచుకొనవలయును. పచ్చిగోడమీఁద నిల్లు నిలువదు. ఒకవేళ నిలిచినను ఒక్కదెబ్బతో పడిపోవును. ఈవిధముగానే

బ్రహ్మచర్యములేక జీవనము నిలువదు. ఒకవేళ నిలిచినను అది దుఃఖములోనే నిండియుండును. అదియు అల్పకాలమువఱకే. కారణ మేమి యననేటి మన దుర్దశ ఇట్లున్నది.

## —♦ వీర్యధారణమే బ్రహ్మచర్యము ♦—

శరీరములో ఓజోధాతు వుండుటయే జీవనకారణ మగుచున్నది. వాగ్భటుఁ డిట్లు చెప్పినాఁడు:—

శ్లో॥ ఓజశ్చ తేజో ధాతూనాం శుక్రాంతానాం పరం స్మృతమ్
హృదయస్థమపి వ్యాపి దేహస్థితినిబంధనమ్॥
యస్య ప్రవృద్ధౌ దేహస్య తుష్టిపుష్టి బలోదయాః
యన్నాశే నియతో నాశో యస్మిం తిష్ఠతి జీవనమ్॥
నిష్పద్యన్తే యతో భావా వివిధా దేహసంశ్రయాః
ఉత్సాహ ప్రతిభాధైర్యలావణ్యసుకుమారతాః॥

రసము మొదలు వీర్యమువఱకు గల సప్తధాతువులలో గల తేజస్సునే ఓజ స్సందురు ఓజస్సు ముఖ్యముగా హృదయములో నుండును. కాని అది దేహమునం దంతటను వ్యాపించును. ఓజోవృద్ధిచేతనే తుష్టిపుష్టిబలాదులుత్పన్న మగును. ఓజోనాశనమువలననే మృత్యువు సంభవించును. ఇదియే జీవనాధారము. దీనివలన నుత్సాహము ప్రతిభ, ధైర్యము, లావణ్యము సుకుమారత్వము ప్రాప్తించును. ఈఓజ స్సెచ్చటనుండి వచ్చును? సుశ్రుతుఁడిట్లు చెప్పెను. "రసాదీనాం శుక్రాంతానాం యత్పరం తేజ స్తత్ ఖల్వోజ స్తదేవ బలమితి" రసము మొదలు శుక్రము వఱకు గలధాతువులలోని తేజోభాగమునకు ఓజస్సనియందురు. ఇదియే బలము.

శార్ఙ్గధరుఁడీ ఓజ స్సెట్లుండును, ఎక్కడ నుండునన ఇట్లు చెప్పినాఁడు,

"ఓజస్సర్వశరీరస్థం స్నిగ్ధం శీతం స్థిరం సితమ్
సోమాత్మకం శరీరస్య బలపుష్టికరం మతమ్"॥

ఓజస్సు శరీర మంతట నుండును. అది స్నిగ్ధము, శీతలము, స్థిరము, శ్వేతవర్ణము, సోమాత్మకము, శరీరమునకు బలము పుష్టి నిచ్చునదియై యున్నది.

ఇట్లనుటచే ఓజస్సు వీర్యమునుబట్టి కలుగుచున్నదని తెలుచున్నది. కాఁబట్టి వీర్యమే జీవనధారణమునకు ప్రధానోపాదానమై యున్నది. ఇదియే జీవనమునకు ప్రధానావలంబనము. ఇప్పుడు వీర్యమన నేమో, దాని యుత్పత్తి యెట్లు కలుగునో తెలుసుకొనవలెను. ఆయుర్వేదమురీత్యా శరీరములో సప్తధాతువు లుండు టావశ్యకము. ఈపదార్థములు మనుష్య జీవనమును ధరించును. అందువలననే వీటిని ధాతువు లందురు.

శ్లో॥ ఏతే సప్త స్వయం స్థిత్వా దేహం దధతి యన్నృణామ్
రసాసృఙ్మాంసమేదోఽస్థి మజ్జాశుక్రాణి ధాతవః॥

రస రక్త, మాంస, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్రములను నీయేడు పదార్థములుండి మనుష్యుల దేహములను ధరించుచున్నవి కావున వీనికి ధాతువులను పేరు వచ్చినది. మనము తినునాహారము, త్రాగునీరు, శరీరముపైని పూఁతలు, వాసన చూచిన వాసన అన్నియు లోనికి బోయి ముందు రసమును బుట్టించి క్రమముగా రక్త, మాంస, మేదోస్థిమజ్జాశుక్రములగును.

శ్లో॥ రసాద్రక్తం తతో మాంసం-మాంసాన్మేదః ప్రజాయతే
మేదసోఽస్థి మజ్జాతతో మజ్జా-యాః శుక్రసంభవః॥ (సుశ్రుతుఁడు)

భోజనము చేయఁగానే ముందు రసమగును. రసము నుండి రక్తము, రక్తమునుండి మాంసమునుండి మేదస్సు

(క్రొవ్వు) క్రొవ్వునుండి ఎముక, తర్వాత మజ్జ, దానినుండి శుక్రము నేర్పడును.

ఈ వీర్యమే ఓజోరూపమైన గొప్ప తేజస్సై శరీరమునంతను ప్రకాశింపఁజేయును. ఒకధాతువు మఱియొకధాతువుగా మారుటకు అయిదుదినములు పట్టును. సారపదార్థము శరీరముననిలిచి, పాచనక్రియలో మిగిలిన పిప్పి పుసి గులివి చీమిడి, చెమట, పాచి, మలమూత్రములు; వెండ్రుకలు, గోళ్ళు, మూలికము గా బయటకు వచ్చును. శుక్రముగా మారఁగానే పాచనక్రియ ఆగిపోయి శరీరములో ఓజస్సుగా మారినిలుచును. ఈవిధముగా రసము మొదలు శుక్రమువరకుగల అఱుధాతువులలో జరుగు పాచక్రియ ఒక్కొక్క దానికి అయిదుదినములుచొప్పున మొత్తము ముప్పదిదినములు పట్టును. అనఁగా నీదినమునఁ దినిన పదార్థము నెలదినములకు వీర్యమగును. నికరముగా నలుబది శేర్లభోజన మొకశేరు రక్తమగును. ఆశేరురక్తమునుండి రెండుతులములు మాత్రమే వీర్యమగును. ప్రతిదినము ఒకశేరు భోజనముచేయువాఁడు నెలకు ముప్పదిశేర్లకంటె ఎక్కువ తినఁజాలఁడు. పైలెక్కప్రకారము నెలకు 1½ తులములు మాత్రమే వీర్యమగును. ఇది నెలసంపాదన. ఇఁక ఒక్కసారి స్త్రీసంపర్కమువలన 1½ తులములకు తక్కువపోదు. విచారించఁగా నెలసంపాదనను క్షణములో పోఁగొట్టుకొనుచున్నాఁడు. ఈవిధముగా ప్రతిరోజు నష్టముచేసికొనిన దివాలా అగుటకు ఆలస్యముపట్టదు.

శ్లో॥ శుక్రం సౌమ్యం సితం స్నిగ్ధం బలపుష్టికరం స్మృతమ్
గర్భబీజం వపుస్సారో జీవనాశ్రయ ఉత్తమః.

వీర్యము సౌమ్యము, శ్వేతము, స్నిగ్ధము, బలము, పుష్టికారకము, గర్భబీజము, శారీరక శ్రేష్ఠసారము, జీవనమునకు ప్రధానాశ్రయమై యున్నది. ఇది

శ్లో॥ యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షురసే యథా
ఏవంహి సకలే కాయే శుక్రం తిష్ఠతి దేహినామ్.

పాలలో నేయివలెను, చెఱకులో బెల్లమువలెను శుక్రము దేహమం దంతటను వ్యాపించియున్నది. కాఁబట్టి వెన్నను తీయుటకు పాల నెట్లు చిలుకవలెనో బెల్లమునుదీయుటకు చెఱకు నెట్లు మథించవలెనో అట్లే వీర్యము బయటకు వచ్చుటకు శరీర మంతయు నట్లు మథింపఁబడుచున్నది. వెన్నను తీయఁగానే పాలెట్లు సారహీనము లగునో, బెల్లమును తీయఁగానే చెఱకు గడ ఎట్లు పిప్పిపిప్పి యగునో అట్లే వీర్యపతనము కాఁగానే శరీరము సారహీనము, నిస్తేజము, నలిగి చూర్ణముచూర్ణము నగును. శరీరములోని నాడు లన్నియు డీలాపడిపోయి ప్రతి అవయవము బలహీనమగును. వీర్యపతనమువలననే మానవపతనము. వీర్యధారణమువలననే మానవజీవనము. వీర్యధారణమునకే బ్రహ్మచర్య మందురు. వీర్యధారణం బ్రహ్మచర్యమ్'.

శ్లో॥ మరణం బిందుపాతేన - జీవనం బిందుధారణాత్
తస్మాదతిప్రయత్నేన - కురుతే బిందుధారణమ్. (శివసంహిత)

బిందుపతనమువలననే మరణము. బిందుధారణమువలన జీవనము. కావున నతిప్రయత్నమున బిందుధారణము చేయవలెను. శివుఁ డీ బిందుధారణమువలననే హాలాహలమును మ్రింగియు స్వస్థుఁడై యున్నాఁడు. ఈ మాహాత్మ్య మంతయు కామ (మన్మథ) జయమువలననే,—

శ్లో॥ సిద్ధే బిందౌ మహాయత్నే కిం న సిద్ధ్యతి భూతలే
యస్య ప్రసాదా న్మహిమా మమా ప్యేతాదృశో౽భవత్. (శివుడు)

దేనియొక్క మహిమచేత సమస్తబ్రహ్మాండమున నాకిట్టిమహిమ కలిగెనో అట్టి బిందు ( వీర్య ) ధారణమువలన సిద్ధించని దేది కలదు ?

భక్తవరా జగు హనుమంతుని, భీష్మపితామహుని బ్రహ్మచర్యప్రతాపము జగత్ప్రసిద్ధము. సర్వపురుషార్థములకు మూలము బ్రహ్మచర్య మనునది సత్యము. దీనివలన మానవుడు నిరోగి గాను, సుఖిగా నుండును. దీనివలన అకాలమృత్యువు, ముసలి తనము, మృత్యువు రావు. దీనివలన హృష్టపుష్టబలిష్ఠులును, ధర్మపరాయణు లగు సంతానము కలుగును. దీనివలన దీర్ఘజీవి, శ్రుతిసంపన్నుడు, సత్యవాది, జితేంద్రియుడు, ధర్మనిష్ఠుడగును. దీనివలన భజన ధ్యానములకు యోగ్యతకలుగును. దీనివలన యోగసాధనయందు రుచికలిగి, యోగము సిద్ధించును. దీనివలన మానవుడు నిర్భయుడును, వినమ్రుడునై లోకసేవ ప్రాప్తియుచేయును. దీనిబలముచేతనే చివరకు పరమాత్మ కలుగును. ఇదియే అన్నిటికంటె ముఖ్యసాధనము. ప్రజాపతియైన బ్రహ్మ, దేవరాజగు ఇంద్రుడు దీర్ఘకాలము బ్రహ్మచర్యపాలనము చేసినమీదటనే బ్రహ్మవిద్యోపదేశమున కధికారులైరి. భగవానుడు గీతలోకూడ 'య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి' పరమాత్మప్రాప్తికి బ్రహ్మచర్యమును పాలించవలెననెను. మనకు నిజముగా భగవత్ప్రాప్తియం దిచ్ఛ యున్నయెడల బ్రహ్మచర్యమును చరించవలెను. మన సంతానముచే అట్లు చేయించి భగవత్ప్రాప్తికి అధికారులనుగా జేయ

వలెను. ఎవరిట్లు చేయరో వారు తమ పాదములను తామె తెగఁగొట్టుకొన్నట్లగును.

—♦ వీర్యనాశనమువలన హాని ♦—

మైధునమువలన వీర్యనాశన మగును. మనశాస్త్రములో అష్టవిధమైధునములు చెప్పఁబడినవి. వానినుండి తప్పించుకొనుటకే బ్రహ్మచర్య మందురు.

శ్లో॥ స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తి రేవచ
ఏతన్మైధున మష్టాంగ ప్రవదంతి మనీషిణః
విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః

(౧) స్త్రీని స్మరించుట, (౨) ఆమె రూపగుణములను వర్ణించుట, స్త్రీసంబంధమైన చర్చసేయుట, కీర్తించుట, శృంగార గ్రంథములను పఠించుట, (౩) స్త్రీలతో చీట్లపేక, జూదము, చదరంగము మొదలగునవి ఆడుట, (౪) స్త్రీని చెడుదృష్టితోఁ జూచుట, (౫) స్త్రీతో నేకాంతసంభాషణ చేయుట, (౬) స్త్రీ నెట్లయిన బ్రాప్తింపఁజేసి కొనుటకు మనస్సులో సంకల్పము చేయుట, (౭) దానికై ప్రయత్నించుట, (౮) ప్రత్యక్షసాంగత్యము చేయుట—అను నీ యెనిమిది మైధునములని విద్వాంసులు చెప్పిరి. ముముక్షువులు దీనినివదలి బ్రహ్మచర్య మనుష్ఠించవలెను.

పరస్త్రీతో మైధునముగావించుట సర్వదా సర్వథా నిషిద్ధము. కాని తనభార్యతోఁగూడ నీ యెనిమిది మైధునములు మానుట ముముక్షులకు ముఖ్యము. స్త్రీతో నేవిధమైన సంబంధ మున్నప్పటికిని వీర్యనాశన మగును. ప్రత్యక్ష సంగమము

వలననేగాక యితర మైథునక్రియ లేడింటివలనఁగూడ వీర్యము స్ఖలితమై అండకోశములలో వచ్చిచేరును. ఇట్లు చేరుటవలన ధాతుదౌర్బల్యము, స్వప్నవికారము, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, క్షయ మొదలగు అనేకరోగములు కలుగును. ఈ రోజులలో సభ్యతలో మైథునములో ననేకవిధములైన అనైసర్గికోపాయములు వెలసినవి. వీనివలన ప్రత్యక్ష స్త్రీసహవాసమునకువలె భీషణరూపముగ వీర్యనాశన మగుటయేగాక యీ పాపాచారము ముందుముందు వృద్ధియగునట్లు తోచుచున్నది. ఇప్పటికి దాని ఫలితముకూడ కనఁబడినది. మనస్సు, దేహము దుర్బలమగును. బుగ్గలు సొట్టలుపడును. శరీరము పాలిపోవును. స్మరణశక్తి నశించును. తలతిరుగును. హృదయదౌర్బల్యము కలుగును. కండ్లు మండును. ఆఁకలి తగ్గును. భీరుత్వ మేర్పడును. సుఖనిద్రయుండదు. సోమరితన మావేశించును. తాత్పర్యమేమన, జీవితము క్లేశసముద్రమగును. ఆయుర్వేదమునందు అర్శస్సు, పాండువు, రక్తపిత్తము, రాజయక్ష్మము, కాసము, స్వరభేదము, మూర్ఛ, దాహము, అగ్నిమాంద్యము, వాతము వీనికన్నింటికి కారణము వీర్య మధికముగ నాశనమగుటయే యని చెప్పబడియున్నది. పాశ్చాత్యవైద్యుల మతముకూడ నిదియే. ఇట్టిస్థితిలో (దైవ) మననధ్యానము లెట్లు జరుగును? కాఁబట్టి సుఖేచ్ఛ గలవాఁడు తాను బ్రహ్మచర్యము చేయుట, తన సంతానముచేత చేయించుట ముఖ్యకర్తవ్యమైయున్నది. గర్భాధానకాలమునుండియే చాల జాగ్రతగా బ్రహ్మచర్యపాలనము చేయించుటవలన బాలకుని భావిజీవనము సుఖమయము గావించుటకు ప్రయత్నించవలెను. బాలుఁడు గర్భమున నున్న

ప్పుడు తల్లిదండ్రులు ఎప్పుడు ఏవిధమైన బూతులుగాని, చెడ్డ మాటలుగాని మాటాడరాదు. చెడ్డనవలలు, నాటకములు చదువరాదు. చెడ్డనాటకములు, సినిమాలు చూడరాదు. అసభ్య శృంగారద్యోతకములు, అశ్లీలములు నగు నగ్నచిత్రములు చూడరాదు. ధర్మశాస్త్రాధ్యయనము చేయవలెను. భక్తులయొక్కయు, మతస్థాపకులు మొదలైనవారియొక్కయు గాథలను వినవలెను, చదువవలెను. గర్భకాలమున తల్లినడవడి, ఆలోచన యెట్లుండునో ఆమె సంతానము నడవడియు నట్లే యుండును. ఈ విషయము ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసు లొప్పుకొనినదియే. వీరాభిమన్యుఁడు పద్మవ్యూహభేదనము సుభద్రాగర్భమునందే నేర్చుకొనెను. భక్తశ్రేష్ఠుఁడగు ప్రహ్లాదునందు భక్తిప్రభావము గర్భములో నుండఁగానే పడినది. ఇంక ననేకోదాహరణములు గలవు. పిల్లవాఁడు పుట్టిన తర్వాతనైనను బాలుఁ డేమియుఁ దెలియనివాఁడని వాని ముందు తల్లిదండ్రు లేవిధమైన చెడ్డసంభాషణము, చెడ్డపనులు చేయరాదు. వివాహవిషయముకూడ తేరాదు. విద్యాభ్యాస యోగ్యత కలిగినతర్వాతనైనను బ్రహ్మచర్యము, సదాచారము మతబోధవిషయమున శ్రద్ధగల గురువునొద్దకే పంపవలెను. ఇప్పటి స్కూళ్లు, కాలేజీలు చాల చెడ్డదశలో నున్నవి. బాలకులు దురాచరణము చేయనటువంటి స్కూలుగాని కాలేజీగాని అసలుగలదా ? చాల విచారించవలసిన విషయ మేమన భారతదేశముయొక్క ఆశాస్థలము, భారతజననియొక్క ప్రియ సంతానముయొక్క జీవనశక్తి శిక్షణ యను పేరిట చాల నష్టము కలుగుచున్నది. ప్రప్రథమమున పాశ్చాత్యవిద్యాభ్యా

నము యొక్క విషరోగమే బాలురను తమ ధర్మమునుండి పతనము గావించుచున్నది. రెండవది యిప్పటి స్కూళ్ళు కాలేజీల విషయప్రధానతవలనఁ జెడిన వాతావరణము వారి జీవనశక్తుల నన్నిటిని చెడగొట్టివేసినది. మన జాతిజీవనములో నిది యొక గొప్ప విచారకరమైన సంగతి. దీనినుండి మనము రక్షింపఁబడకున్న యెడల గొప్పయనర్థము వచ్చుననుట నిజము. బుద్ధిమంతులు శీఘ్రముగా మేల్కొనవలెను. సర్వవిధముల ఇంద్రియ సంయమనము గావించి బ్రహ్మప్రాప్తికై అరణ్యావాసియు, త్యాగియునైన గురుని కుటీరమున నుండి సర్వవిధముల మంచి శిక్షణ పొందవలెనను శ్రుత్యాదర్శ మెక్కడ! నేఁడు గొప్ప గొప్ప భవనములందు ఇంద్రియసంయమము లేని ఉపాధ్యాయుల విషయప్రసవనియు, జడవాదమునఁ బడవేయునది యగు శుష్క అవిద్యారూపమైన శిక్షణ మెక్కడ! ప్రాచీనగురుకులమున నుండు బ్రహ్మచారి విద్యార్థుల పవిత్రజీవనము కొంచెము గమనించుడు. విద్యాభ్యాసయోగ్యుఁడు కాఁగానే ఉపనయన సంస్కారముచే సంస్కృతుఁడై తల్లిదండ్రులను, ఇల్లువాకిలిని వదలి యొంటరిగా సమిత్పాణియై త్యాగియు, విద్వాంసుఁడును, వనవాసియు నగు గురుగృహమునకుఁ బోయి, గురుని పరమాత్మగా భావించి సర్వవిధముల నతని సేవచేయుచు, బ్రహ్మచర్యాశ్రమములోని కఠిననియమములను బాలింపుచు శ్రద్ధాభక్తులతో సద్విద్యాభ్యాసము చేయును. బ్రహ్మచారి నియమములను జూడుడు :

శ్లో॥ సేవతే మాంస్తు నియమాన్ - బ్రహ్మచారీ గురౌ వసన్
సన్నియ మ్యేంద్రియగ్రామం - తపోవృద్ధ్యర్థ మాత్మనః,

నిత్యం స్నాత్వా శుచిః కుర్యా ద్దేవర్షి పితృతర్పణమ్
దేవతాభ్యర్చనం చైవ సమిదాధాన మేవచ
వర్జయే న్మధు మాంసంచ గంధం మాల్యం రసాన్ స్త్రియః
శుక్తాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనం
అభ్యంగ మంజనం చాక్ష్ణో రుపానచ్ఛత్రధారణం
కామం క్రోధంచ లోభంచ నర్తనం గీతవాదనం
ద్యూతంచ జనవాదంచ పరివాదం తథానృతం
స్త్రీణాంచ ప్రేక్షణాలంభ ముపఘాతం పరస్యచ.
ఏకః శయీత సర్వత్ర న రేతః స్కందయే త్క్వచిత్
కామాద్ధి స్కందయన్ రేతో హినస్తి వ్రత మాత్మనః
స్వప్నే సిక్త్వా బ్రహ్మచారీ ద్విజః శుక్ర మకామతః.
స్నాత్వార్క మర్చయిత్వా త్రిః పునర్మా మిత్యృచం జపేత్,

(మనుస్మృతి ౨ అ ౧౭౫–౧౮౧ శ్లో॥

'బ్రహ్మచారి గురుగృహమున నుండి తన తపోవృద్ధి కొఱకు సమస్తేంద్రియములను వశమునం దుంచుకొని యీ నియమములను పాలించవలెను. నిత్యము స్నానముచేసి శుచియై దేవర్షి పితృతర్పణము చేయవలెను. దేవతాపూజ, సమిదాధానము చేయవలెను. తేనె, మాంసము, చందనము, పూలమాలలు, రసములను, స్త్రీలను, సమస్తాసవములను, ప్రాణిహింసను సర్వథా వదలవలెను. అభ్యంగనము, కాటుకపెట్టుకొనుట, పాదరక్షలు, గొడుగును ధరించుట, కామము' క్రోధము, లోభమును వదలవలయును. నృత్యము చేయరాదు. గీతము పాడరాదు. జూదమాడరాదు. పరచర్చ పనికిరాదు. పరనింద, అసత్యము పలుకుట, స్త్రీని చూచుట, స్పర్శించుట పనికిరాదు. పరులకు చెఱుపు చేయరాదు. ఎల్లప్పుడు ఒంటరిగానే నిద్రించవలెను. ఎప్పటికిని వీర్యపాతము చేయనేరాదు.

ఏ విద్యార్థి కామముచే వీర్యపాతము గావించినాఁడో వాఁడు బ్రహ్మచర్యవ్రతభ్రష్టుఁ డగుచున్నాఁడు. ఇచ్ఛలేకయే స్వప్నమున వీర్యపాతమైనయెడల ఉదయముననే స్నానముచేసి సూర్యభగవానుని పూజించి "పునర్మామైత్వింద్రియమ్" అను ఋక్కును మూఁడుమార్లు జపించవలెను.'

ఇది బ్రహ్మచారి జీవితచర్య. రాజకుమారునికి బిచ్చగానికి నీ విషయమున భేదములేదు. భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు దరిద్రుఁడైన కుచేలుఁడు సాందీపమహాముని యొద్ద విద్యాభ్యాసము చేసినట్లు కథ ప్రసిద్ధమేకదా! దీనితో వర్తమానకాలపు విద్యాభ్యాసము చేయు విద్యార్థులను పోల్చుండి! ఇంద్రియసంయమి, వినమ్రుఁడు, గురుసేవకుఁడు, త్యాగి, విలాసశూన్యుఁడు, పవిత్ర మనఃకాయములుగలవాఁడు, ధర్మజ్ఞాననిపుణుఁడు, ఈశ్వరభక్తుఁడు, దండమేఖలాధారి, అమాయకుఁ డగు బ్రహ్మచారి యెక్కడ! ఇంద్రియాలోలుఁడు, ఉద్దండుఁడు, ప్రొఫెసర్లను ఎగతాళిచేయువాఁడు, విషయాసక్తుఁడు షోకిల్లా, అపవిత్రశరీరమనములు గలవాడు, మతద్రోహి, ఈశ్వరనిందకుఁడు, బూటు, సూటు, చేతిగడియారము, కండ్లజోడు, తోలుసంచిని పట్టు గర్వియగు యీనాఁటి విలాసములు (upto date fashion) గల *విద్యార్థి యెక్కడ! ఎటువంటి భయానక పరివర్తనము! స్వర్గము నేఁడు నరకార్ణవమైనది. ఋషులచే సేవింపఁబడి, వేదధ్వనిచే పునీతమై, యజ్ఞశాలామండితమై

---

*పైవిషయమున యిప్పటి అందఱు విద్యార్థులిట్టివారని కాదు. ప్రాచీనస్థితికి నిప్పటిస్థితిని పోల్చుచు నిట్లు వ్రాయఁబడినది. సత్పురుషుఁ డెవఁడును దీనిని చెడ్డగా నెంచఁడు.

భారతభూమియందు నేఁడు నాగరికతా, శిక్షణ యను పేరిట మర్యాదాశూన్యమైన విలాసవాసన తాండవనృత్యము చేయుచున్నది. ప్రాచీనధర్మప్రాణమైన ఆర్యజాతి నేఁడీధర్మశూన్యజడవాదముయొక్క బాహ్యాడంబరచమత్కృతిచే, ఆత్మవిస్మృతి చెంది ఆపాతరమణీయవిషపూర్ణవిషయసేవన చేయుచు జర్జరితమై మృతప్రాయమై యున్నది. ఈ జాతిజీవనజ్యోతిని ప్రజ్వలింపఁజేయవలె నన్నచో ప్రాచీనపాలనాదర్శనమును ముందిడుకొని వర్తమాన ఆకాంక్షాపూర్తికి సాధనసహితముగా ధర్మమూలకమై, బ్రహ్మచర్యప్రధాన మగు గురుకులస్థాపన చేయవలెను. త్యాగులు, సదాచారులు, విద్వాంసులు, పరసేవాపరాయణులగు సద్బ్రాహ్మణులు తయారుకావలెను. ప్రాచీన ప్రణాళికారీత్యా స్వార్థరహితముగా సర్వభూతాంతర్వర్తియగు నీశ్వరుని సేవచేయుటకు పవిత్ర గంగా, యమునాది నదుల ప్రక్క ప్రాకృతసౌందర్యసంపన్నమైన నిర్జనస్థానములలో నుండి సుందరాశ్రమములను స్థాపించుటకు ప్రయత్నింపవలెను. వీలైన నిట్టి స్వార్థరహితులును, సదాచారులు నగు గురువులయొద్దకు తమ తమ పిల్లలను మోహము, అభిమానము వదలి పంపవలెను. దేశములో నిట్టివి నాలుగైదు గురుకులము లున్నయెడల ముందుముందు చాల లాభము కలుగును. ఈ మహాకార్యమున కధికారులు, త్యాగులు, విద్వాంసులు, సదాచార సత్పురుషులునై యుండవలెను. ఈ విషయమునఁ బ్రయత్నము చేయకపోవుటచే సర్వవిధముల వీర్యనాశన దుష్కృతము వ్యాపించినది. ఈ దేశము గతి ముందుముం దేమగునో తోఁచుటలేదు. వీర్యనాశనమువలననే సర్వనాశన మగునను

సంగతి జ్ఞప్తియం దుంచుకొనవలెను. వీరాభిమన్యుఁడు, భక్త సుధన్వుఁడు యుద్ధక్షేత్రమునకు వెళ్లుసమయమున వీర్యపాతము చేయకుండినయెడల వారికి మృత్యువే వచ్చియుండెడిది కాదని కొందరు విద్వాంసులు చెప్పుచున్నారు. కాఁబట్టి అందరును జాగ్రతగా వీర్యరక్ష గావింపవలెను. భగవంతుఁ డందఱకు సద్బుద్ధి నిచ్చుఁగాక !

## —♦ బాల్యవివాహము ♦—

ఈ రోజులలో తల్లిదండ్రులయొక్కయు, అభిభావకుల యొక్కయు గొప్పపొరపాటు ఏమియన చిన్నతనముననే తమ బాలికాబాలురకు వివాహము గావించి పవిత్రబ్రహ్మచర్య పథమునుండి పడవేయుట.

హిందూధర్మశాస్త్ర ప్రకారము వివాహము కేవల మింద్రియలాలసతను చరితార్థము గావించుకొను సాధన కాదు. వివాహ మొక పవిత్ర, ఆవశ్యకసంస్కారము. వివాహము గృహస్థాశ్రమమునకు బునాది. గృహస్థాశ్రమముయొక్క ఉద్దేశ్య మేమన స్త్రీ పురుషులిద్దరు ఏకత్వమునుసంపాదించి పవిత్రప్రేమచే నొక్కసూత్రమున బంధింపఁబడి ధర్మాచరణమునఁ బ్రవృత్తులగుటయు, యథాసాధ్యముగా మిగిలిన మూఁడుఆశ్రమవాసుల సేవ చేయుచు భగవత్ప్రాప్తికొఱకు సిద్ధపడియుండుటయు. దంపతులు కామక్రోధలోభములను వర్జించి, ఈశ్వరభావముతో లోకసేవ చేసి, శాస్త్రమర్యాదానుసారము సమస్తవ్యవహారములను గావించుచు దేవఋషిపితౄణములనుండి ముక్తులగుదురు. 'పుత్రార్థం క్రియతే భార్యా' అను శాస్త్రవాక్యముచే భార్యను

పుత్రోత్పాదన కొఱకే చేసికొనుటకేగాని విలాసవాసనకొఱకు గాదు. స్త్రీ సహధర్మచారిణిగాని విలాససామగ్రి గాదు. వివాహము చేసికొనుట సంయమము కొఱకుగాని ఉచ్ఛృంఖలతకు ఆశ్రయ మిచ్చుటకుఁగాదు. మన మీపరమసత్యమును మఱచుటచేతనే స్వర్గముయొక్క నందనవనమువలె నుండు సుఖమయగృహస్థత నేఁడు నరకపురీసదృశమైనది. వివాహముయొక్క ప్రధానోద్దేశ్యమును మనము మఱచితిమి. వివాహధర్మమును వదలి నేఁడు మనము కేవలేంద్రియసుఖసాధనద్వారమును జేరితిమి.

ఇరువదినాలుగు సంవత్సరములవఱకు గురు గృహమున నుండి విద్యాబలసంపన్నుఁడై తనజీవనమును స్వయముగా నిర్వహించుకొను శక్తిగలిగిన విద్యార్థి అప్పుడుమాత్రమే గృహస్థాశ్రమద్వారమున బ్రవేశించుట కధికారియగును. నేఁ డిట్టి మహత్వపూర్ణవ్యవస్థను మఱచి ఏమియు తెలసి తెలియని బాలబాలికలకు బొమ్మల పెండ్లిండ్లవలె వివాహముచేసి వారిభావి జీవనమును నష్టముగావించుచున్నాము. గుడ్డకట్టుకొనుట చేతగానివారిని గృహస్థాశ్రమములోనికి దింపుచున్నాము. పాపమాయమాయకపుబాలకుల కేమి తెలియును? భార్యాభర్తలచే వివాహకాలమునఁ జేయుంచుప్రతిజ్ఞలు వారి కేమి తెలియును? పాపము బాలుఁడు కేవలము వివాహమహోత్సవ సంతోషమున నుప్పొంగుచుండునుగాని పరిణామము నెఱిఁగిన పెద్దల కీయుత్సాహమును గనిన నేడ్పువచ్చును. మనయువకులయవస్థను గనుఁడు యౌవనము రాకపూర్వమే ముసలితనము వచ్చుచున్నది. ఇట్టి స్థితియే స్త్రీలదికూడ. ప్రదరరోగము, రజోవికారము లేనిస్త్రీ

ఒక్కటైయైనఁ గలదా? యువతీయువకుల మరణసంఖ్యను చూచిన గుండె లదురుచున్నవి. మొగ్గ విప్పారకమునుపే యెండిపోవుచున్నది. ఇంతకంటె గృహస్థుకు దుర్దశ యేమిగలదు? తల్లిదండ్రులకు తమపిల్లవానియందు ప్రేమ గలదనుట నిజము. కావున వారలు తెలిసి తెలిసి వారి కనిష్టము గావించరు కాని అజ్ఞానము వారిబుద్ధిని గప్పుటచే నిట్టిపొరపాట్లు చేయుచుందురు. బ్రహ్మచర్యమహాత్మ్యమును మఱచిపోవుటే యీపొరపాటుకు ముఖ్యకారణము. కాని ఇది ఓర్చదగినది కాదు. ప్రకృతి వెంటనే ఫలము నిచ్చుచున్నది. కాఁబట్టి తల్లిదండ్రులు తమ బాల బాలికలకు యుక్తవయస్సు రానిది పెండ్లిండ్లుచేయరాదు. ఇప్పటిపరిస్థితినిబట్టి వధూవరులకు యుక్తవివాహము పన్నెండు, పదునెనిమిది వత్సరము లుండుటమంచిది. యోగ్యతాను సారముగా నీవ్యత్యాసము నింకను పెంచవచ్చును. ధర్మశాస్త్రా నుసారము కన్యకు వివాహవయస్సు రజోదర్శనమునకు పూర్వ మేయని చెప్పఁబడినది అయినప్పటికి తగినవరుఁడు దొరకని నప్పుడు మూఁడు సంవత్సరముల వరకు ప్రతీక్షచేయవచ్చునని మనువు చెప్పియున్నాఁడు. ఆజన్మాంతము కన్యకగానే ఉండ వచ్చుగాని అయోగ్యవరుని కీయరాదనియు చెప్పినాఁడు. కాని యీవ్యవస్థ వరుఁడు దొరకనప్పుడుమాత్రమే. తమకన్యనువ్వైన లోభమునఁగాని ప్రమాదమునఁగాని పిల్లకంటెఁ జిన్నవానికిఁ గాని, ముసలివానికిఁగాని యిచ్చి పెండ్లిచేయుట మహాపాపము. ధర్మశాస్త్రవాక్యమును జూడుఁడు.

శ్లో॥ కన్యాం యచ్ఛతి వృద్ధాయ నీచాయ ధనలిప్సయా
కురూపాయ కుశీలాయ స ప్రేతో జాయతే నరః॥

ఎవ:డు ధనలోభముచే తనకన్యను వృద్ధునకు, నీచు:నకు కురూపి (అంగహీనుని, కి దురాచారునకు (దుర్గుణునకు) ఇచ్చునో వా:డు చచ్చిన మీ:దట పేరిత మగును.

యోగ్యవరుడు దొరికిన రజోదర్శనమునకు పూర్వము వివాహముచేయు టావశ్యకము. ఒక్కటిమాత్రము మనస్సులో నుంచుకొనవలెను. రజోదర్శనము అందఱకు చిన్నతనములో కాదు. బాలికలకు వారి సమక్షమున వివాహచర్చ రాకుండ చూచినను, స్త్రీపురుషప్రేమ, కామచేష్ట చూడకుండ కాపాడి నను, ఉత్తేజజనకపదార్థములు తినుట కీయకున్నను, చెడ్డకథలు, వినుట చెడ్డపుస్తకములు చదువుటకు దొరకకున్నను, విలువగల గుడ్డలు ధరింపనీయకున్నను, షోకుచేసికొనుట, శృంగార మల వాటుగాకున్నను, పురుషులతో నధికముగ కలసిమెలసి తిరుగ కున్నను, బాలురు చదువు పాఠశాలలోనికి చదువుటకు: బంప కున్నను, తాను సుందరి ననుగర్వము రానీయకున్నను చిన్న తనములో రజస్వలలు కారు. ధనికులబిడ్డలలో నెక్కువ త్వరగా రజస్వలలగువారు కలరు. దీనికి కారణ మేమిటన:గా వారికి విలువగల గుడ్డలు దొరకుచుండును, పనులు చేయరు, దాస దాసీజనముల దుస్సాంగత్య ముండును, ఉత్తేజకపదార్థములను దినుచుందురు. ఇదిగాక పల్లెటూరి బాలికలు పట్టణపు బాలికల కంటె ఆలశ్యముగా రజస్వల లగుదురు. నాగరికతాభిమానము గల వారికంటె గ్రామీణకన్యకలు త్వరగా రజస్వలలు కారు.

బాలురుగాని బాలికలుగాని భగవత్ప్రాప్తిని ఉద్దేశించి ఆ జీవనము లేదా యథాసాధ్యము అధిక కాలము బ్రహ్మచర్య పాలనము చేయు:దల:చిన స్వతంత్రించి చేయవలెను. కాని

ఒక్కటిమాత్రము జ్ఞాపక ముంచుకొనవలయును. మధ్యలో కుసంగతిచే జీవితము చెడఁగొట్టుకొనరాదు. ఏలనన నిది గొప్ప చిక్కుప్రశ్న.

## —గృహస్థ బ్రహ్మచర్యము—

వివాహము చేసికొనిన భార్యతో నెట్టివ్యవహారము గావించినప్పటికిని అది ధర్మమే యని కొందఱ యభిప్రాయము. దీనివిషయమున వారు పరమాత్ముని సంకెలలనుండి విడివడినా మనియే తలఁతురు. ఇది వారి భ్రమ. కర్మవశమున జగన్నియంతయొక్క నాటకములో భార్యాభర్తలుగాను, తల్లిదండ్రులుగాను పాత్రల ధరించి ఆడి, వారివారి కర్మఫలానుసారము భగవంతుఁ డేస్థానమున నటింపఁబంపునో అచటకు మరుజన్మమునకైన పోయితీరవలెను. ఎచ్చట ఏయేవేషము చిక్కునదో అట్లే నటించవలెను. మన కీజీవితములో నేస్త్రీకి భర్తకావలెనో అది ఆ పరమాత్ముని ఆజ్ఞానుసారము, ఇచ్ఛానుసారము జరుగును. కాఁబట్టి యీ భార్యాభర్తృసంబంధము ధర్మబంధనమేగాని, కామతృప్తికి సాధనముకాదు. దంపతులు ఈ ధర్మసంబంధము నెఱిఁగి ఇంద్రియసంయమపూర్వకముగా తమ జీవనములోని సమస్తకార్యములు (రంగముమీఁది నటకునివలె) మమకారరహితముగా అనాసక్తిభావముతో లాభాలాభములందు సమభావముంచి భగవదర్పణబుద్ధితో చేయవలెను. మనుష్యుఁడే యిట్టిజ్ఞానమున కధికారి. కాఁబట్టియే వీఁడు సర్వజంతువులకంటె శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు. కామోత్తేజముచే పిచ్చివాఁడగుట పశుధర్మము. నిజము చెప్పవలసివచ్చిన మన

స్థితి పశువులకంటె హీనముగా నున్నది. పశువులుగూడ నియమములు పాలించును. అవి జబ్బుగా నున్నప్పు డీపనికి దిగవు. పశువులలో చాల భాగము సంవత్సరమున కొకసారియే గర్భధారణచేయును. గర్భధారణము కాఁగానే స్త్రీపశువు కామాభిలాషగల పురుషపశువును దగ్గరకే రానీయదు. పశువులు మనకంటె బలముకలవి. మనమో వాటికంటె బలహీనుల మయ్యు ఇంద్రియదాసులమైనాము. మనకంటె పశువు బలము కలదయ్యు ఇంద్రియసంయమనము చేయుచున్నది. మనము బలహీనులమయ్యు ప్రకృతినియమముల నతిక్రమించుచున్నాము.

శ్లో॥ బ్రహ్మచర్యం సమాప్యాథ గృహాధర్మం సమాచరేత్
ఋణత్రయవిముక్త్యర్థే ధర్మేణోత్పాదయే త్ప్రజామ్॥

బ్రహ్మచర్యమును ౨౫ సంవత్సరములు పాలించి యువావస్థలో దేవ, ఋషిపితృఋణములను తీర్చుటకై గృహస్థుఁడై ధర్మవిధిచే సత్సంతానమును గనవలెనని శాస్త్రము చెప్పుచున్నది.

యథార్థమునకు ఈప్రకారమైన ధర్మభీరువు, సంయమియగు గృహస్థుఁడు ఓజస్వియు, తేజస్వియు, బలవంతుఁడగును. వివాహమున నొకమంత్రము గలదు. వరుఁడు కన్యతో నిట్లనును—

"గృహ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాసః భగో౽ర్యమా దేవః సవితా పురంధిః ర్మహ్యం త్వా౽దుర్గార్హపత్యాయ దేవాః అమో౽హమస్మి మాత్వం మాత్వా మస్య మో౽హం సామాహమస్మి ఋక్త్వం ద్యౌరహం పృథివీ త్వం తా వేహి వివహావహై సహరేతో దధావహై ప్రజాం ప్రజనయావహై పుత్రాన్ విందావహై బహూంస్తే సంతు జరదష్టయః సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం శృణుయామ శరదః శతమ్."

ఓ కల్యాణీ! నేను నాకు కాంతి, శ్రీ, మహిమ, జ్ఞానము, ధర్మపూర్తికొఱకు నిన్ను గ్రహించుచున్నాను. నీ యాత్మ యెప్పుడును వేఱుపడరాదు. మన మిద్దరము వృద్ధావస్థను ఒక్కమారే చెందుదుముగాక. భగుఁడు, అర్యముఁడు, సవిత్రాదిదేవతలు నిన్ను నాతో కలిపినారు. నీవు గృహకృత్యముల నొనర్చెదవు. కల్యాణీ! నీద్వారా నాకు శాంతి, శ్రీ, కాంతి మొదలైనవి వికాసముఁజెందుఁగాక! కాఁబట్టి నీవు లక్ష్మీసమానవు. నీవే లేకపోయిన నాకు కాంతి, శ్రీ మొదలైనవి ఉండవు. నేను లక్ష్మీహీన్యుఁడను. నిన్నుఁ బొందుటచే నేను లక్ష్మీవంతుఁడనైతిని. నేను సామరూపుఁడనైన నీవు ఋక్స్వరూపవు. ఋక్సామముల కెట్టి ఘనసంబంధమో, ఋక్కులేకుంటే సామమునకు పుష్టి, సత్త లేదో అట్లే నీవు లేక నాకు నా యింద్రియములకు పుష్టిసత్తలేదు. నే నాకాశరూపుఁడనైతే నీవు పృథ్వీరూపమవు. పృథ్వీఆకాశముల కెట్లు సంబంధము ఓతప్రోతమైనదో అట్లే నీతో నాకు సంబంధము గలదు. కాఁబట్టి నీ వాత్మసమర్పణచేయుము. మన వివాహ సంబంధము సుదృఢమగుగాక! మన మిద్దరము రేతస్సంయమనము చేయవలసియున్నది. దేహసంయోగమున సుపుత్రులను బడయవలసియున్నది. ఆ సుఖము ననుభవింతుము. ఈ విధముగా పుత్రోత్పాదనమైనవారు దీర్ఘము లగుదురు. మన ఇద్దరి ఆత్మ లొకటైనప్పుడు యిద్దరకు తేజోవృద్ధియగును. ఇద్దరి హృదయములు కలిసి సమున్నతమగును. మనము నూఱు వర్షములు జీవింతుముగాక! నూఱువర్షములు చూతుముగాక! నూఱువర్షములు విందుముగాక!

దీనివలన మన కేమి తెలియుచున్నదంటే రేతస్సంయమన ముండినయెడల నూఱుసంవత్సరము లాయువు. లేకున్న నూఱుసంవత్సరము లాయువులేదు. బలిష్ఠత, మేధావిత్వము కూడ కలుగదు. ఇప్పుడు మనము రేతఃసంయమనము చేయక పోవుటచే మన స్థితి, మన సంతానము స్థితి యెట్లున్నది. దేహము కేవలము ఎముకలగూడైనది, మనస్సు యుక్తాయుక్త వివేకశూన్యమైనది. దీనికి కారణమేమన 'సంతానార్థంహి మైథునమ్' అను శాస్త్రోక్తిని అవహేలన చేయుటయే.

శ్లో॥ ఋతావృతౌ స్వదారేషు సంగతి ర్యా విధానతః
బ్రహ్మచర్యం తదేవోక్తం గృహస్థాశ్రమవాసినామ్- (యాజ్ఞవల్క్యుఁడు)

ఋతుకాలమందు తన ధర్మపత్నితో విధిప్రకారము కేవలము సంతానార్థము సంగమముచేసినవాఁడు గృహస్థాశ్రమములోనుండియు బ్రహ్మచారియే. స్వస్త్రీతో ఋతుకాలమందే సంగమము చేయవలెను గాని ఎప్పుడుపడితే అప్పుడు పనికిరాదు. ఋతుకాలమనఁగా రజోదర్శనమైన నాల్గవరోజే కాదు. ఆరోజున నేదైన గ్రహణము, శ్రీరామనవమి మొదలగు పర్వము లుండిన ఆ దినము సంసర్గమునకు నిషిద్ధము. మనువుకూడ స్వస్త్రీతో ఋతుకాలమునందే కూడవలయుననియు, పర్వముల వర్జించవలెననియు చెప్పెను.

శ్లో॥ ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః
చతుర్భి రితరైః సార్థ మహోభిః సద్విగర్హితైః
తాసా మాద్యా శ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః॥ (మనుస్మృతి)

సత్పురుషులచే నిందితమైన రజోదర్శనమైన మొదటి నాల్గుదినములతోగూడ పదునాఱుదినములు ఋతుకాలమని

చెప్పఁబడినది. ఈ పదునాఱుదినములలో మొదటి నాల్గుదినములు, పదునొకండవదినము, పదుమూఁడవదినము నిందితమైనవి. మిగిలిన పదిరాత్రు లుత్తమమైనవి. ఈ పదిరాత్రులలో పాడ్యమి, షష్ఠి, అష్టమి, ఏకాదశి, ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ, వ్యతీపాతము, గ్రహణము, శ్రీరామనవమి, శివరాత్రి, శ్రీకృష్ణాష్టమి, శ్రాద్ధదినము, సంక్రాంతి, ఆదివారము మొదలగునవి వదలఁగా నా పదిదినములలో మిగిలినవాటియందు కేవలము సంతానముకొఱకుగాని, స్త్రీకోరికపైఁగాని నెలలో రెండుమార్లుమాత్రమే స్త్రీసంగమము చేయువాఁడు గృహస్థాశ్రమములోనుండియు బ్రహ్మచారియే.

శ్లో॥ నింద్యా స్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్
బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్॥ (మనుస్మృతి॥

నింద్యములైన ఎనిమిది రాత్రులు మొదటి ఆఱురాత్రులు వదలి కేవలము నెలలో రెండురోజులుమాత్రము ఋతుకాలమున సంగమించువాఁడు బ్రహ్మచారి.

రజస్వలతో నెన్నఁడు సంసర్గము చేయరాదు. దీనివలన ననేక రోగములు కలుగును. ఇవిగాక ఆశ్లేష, మఘ, మూల, కృత్తిక, జ్యేష్ఠా, రేవతి, ఉత్తరాభాద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములందుకూడ స్త్రీసంపర్కము పనికిరాదు. దేవాలయము, దారిమార్గము, శ్మశానము, అనుపత్రి, బ్రాహ్మణగృహము, గురుగృహమునందును, ఉదయము, సంధ్యాకాలములందును, అపవిత్రుఁడయ్యును, మందుతీసికొనినమీఁదటను, ఆఁకలిజెందియుండియు, అన్నముతినఁగానే, మిత్రునియొక్కయు గురునియొక్కయు శయ్యలందు, మలమూత్రత్యాగము చేయ

వలసివచ్చినప్పుడును, దుఃఖితమనస్సుతోను, ఆవేగమునందును, క్రోధమందును, వ్యాయామమొనర్చియు, దప్పికతోను, ఉపవాసదినమునందును, పరులసమక్షమునను స్త్రీసంగమము చేయరాదు. స్త్రీ సంగమమువిషయమున గ్రీసులో మహానుభావుఁడగు సోక్రెటీసునకు, ఆయన శిష్యున కిట్లు సంభాషణ జరిగెను.

శిష్యుఁడు:- మనుష్యుఁడు స్త్రీసంగమ మెన్నిసార్లు చేయవలెను ?

సాక్రటీసు:- జీవితములో నొక్కసారి.

శి:- దీనితో తృప్తికాకపోతే ?

సో:- సంవత్సరమున కొక్కసారి.

శి:- దీనికిగూడ తృప్తికాకపోతే ?

సో:- నెలకొకసారి.

శి:- అప్పటికి ఉండలేకపోతే ?

సో:- నెలకు రెండుసార్లు కాని యిట్లు చేయువారికి మృత్యువు త్వరగా సమీపించును.

శి:- దీనికిని తృప్తిలేకపోతే ?

సో:- చితికి కట్టెలు సిద్ధముచేసిపెట్టుకొని నీయిష్టము వచ్చినట్లు చేయుము.

పైప్రమాణములనుబట్టి ఎంత తక్కువగా స్త్రీసంగమము చేసిన నంత శ్రేష్టము, పరమార్థమున కంతటి యుపయోగము. స్త్రీపురుషులలో తమ యిచ్ఛానుసారము పూర్తిగా బ్రహ్మచర్యము నడుపఁదలఁచిన నడచుట మంచిది. కొందఱు కృత్రిమము, అనైసర్గికసాధనమువలన సంతాననిరోధము చేయుచున్నారు. ఇది పాపము. అధికసంతానము నాపెడి అన్నిటి

కంటె మంచిదియు, శాస్త్రయుక్తమైన యుపాయము దంపతులు స్వేచ్ఛగా బ్రహ్మచర్యనియమ మవలంబించుట దీనివలన ఇహ పరలోకసుఖములఁ బొందఁగలుగుదురు.

ఇఁక సంక్షేపముగా సూత్రరూపమున బ్రహ్మచర్యరక్షణమునకు సామాజిక, వ్యక్తిగతనియమములు చెప్పఁబడుచున్నవి, వీనిని మననముచేసికొని, ఆచరణలోనికిఁగూడ తెచ్చుకొనవలసి యున్నది.

—◊ బ్రహ్మచర్య రక్షణోపాయము ◊—

1. బాల్యవివాహనిషేధము. ఆడపిల్లలకు ౧౬ సంవత్సరములకు పిల్లవానికి ౧౮ సం॥రములకు పూర్వము పొరపాటుననైన వివాహము చేయరాదు.

2. వృద్ధవివాహము చేయరాదు.

3. బ్రహ్మచర్యాశ్రమస్థాపన చేయవలెను. బాలుర బ్రహ్మచర్యరక్షణకొఱకు బ్రహ్మచర్యశిక్షణము ధర్మమూలకముగ నీయవలెను. ౧౮ సంవత్సరములవరకు దీనిలో నుండితీరవలెను.

4. బాలబాలికల వివాహనిశ్చయము ముందుగా చేయరాదు.

5. బాలబాలికలను విలువగల షోకుగుడ్డలను ధరింపనీయరాదు.

6. శృంగారసంబంధమైన సంస్కృతాంధ్రగ్రంథములను, నవలలను చదువనీయరాదు. చిన్నతనములో బాలబాలికల చేతి కిట్టి పుస్తక మీయరాదు. ఒకవేళ చదివించిన సాహిత్యదృష్టితో చదివించవలెను.

7. శృంగారప్రధానమైన నాటకములు, సినిమాలు చూడరాదు. బాలబాలికలను సాధ్యమైనంతవఱకు పరస్పరము చూడనీయరాదు.

8. ఉత్తేజకపదార్థముల తినిపించరాదు. కారము, ఉప్పు, పులుసు, వేడిమసాలావస్తువులు, కడుతీపి, కడువేడిపదార్థములు తినిపించరాదు. ఆహారము బాగుగా నమిలి తినవలెను. సౌమ్యపదార్థములు సరియైనవేళకు తినవలెను. మద్యమాంసములు బొత్తుగా తినరాదు. మత్తుపదార్థములు ముట్టరాదు.

9. వీలైనంతవఱకు నిత్యము ఉదయము సాయంతనము బహిరంగముగు గాలిలో షికారువెళ్ళవలెను.

10. రాత్రిళ్లు పెందలకడ పరుండి, వేకువను బ్రాహ్మముహూర్తమున సూర్యోదయమునకు కనీస మొకగంటముందే నిద్ర లేవవలెను.

11. స్త్రీపురుషులు ఒకేమంచముమీఁదగాని వెంబడిగాగాని నిద్రింపరాదు. రాత్రి పరుండఁబోవునపుడు, నిద్రలేచునపుడు భగవచ్చింతన చేయవలెను.

12. దంపతులు తప్ప యితర స్త్రీపురుషులు ఏకాంతమున మాట్లాడరాదు, కూర్చుండరాదు.

13. స్త్రీలవైపు చూడనేరాదు. చూచిన మాతృభావమో పరమాత్మభావమో యుంచవలెను. ఇట్లే స్త్రీలును పరపురుషుని జూచిన తండ్రి లేక పరమాత్మభావము నుంచవలెను.

14. నిత్యము సత్సంగము చేయవలెను. లేదా సద్గ్రంథములను అధ్యయనము చేయవలెను. రామాయణము, మహా

భారతము, ఉపనిషద్గ్రంథములలోని మంచిభాగములను నిత్యము స్వాధ్యాయము చేయవలెను. శ్రీమద్భాగవతమును నిత్యము అర్థసహితముగ పఠించవలెను.

15. షోకును వదలవలెను. అలంకారము, శృంగారము కామవాసనను రెచ్చగొట్టునన్న సంగతిని జ్ఞాపకముంచుకొనవలెను. సాధారణముగా శృంగార మితరులు తాను బాగుగానున్నానని అనుకొనుటకే చేసికొందురు. శృంగారము చేసికొనువాఁడు తాను మునుఁగును. ఇతరులను ముంచును.

16. అత్తరు, సెంటు ఎప్పుడును పూయరాదు. ఫేషన్ పనికిరాదు. చట్కారీతనము వదలవలెను. జుట్టు పెట్టరాదు. మాటిమాటికి అద్దము చూచుకొనరాదు. పెదవులు ఎఱుపు చేసికొనుటకై తాంబూలము వేయరాదు. ఆసవములు త్రాగరాదు. ఉత్తేజక ఔషధముల సేవింపరాదు.

17. మలమూత్రత్యాగము చేసినతర్వాత నింద్రియములను చన్నీళ్ళతో కడుగవలెను. మలమూత్రములను నిరోధించకు.

18. నిత్యము చన్నీళ్ళస్నానము చేయవలెను.

19. నియమముతో వ్యాయామము చేయవలెను. లేదా నిత్యము ఆసనప్రాణాయామములనుగూడ చేయుట మంచిది.

20. గోచియో, లంగోటయో తప్పక కట్టవలెను.

2 . భగవన్మూర్తిని ప్రేమపూర్వకముగ దర్శించుము. సాధుసత్పురుషుల మనస్ఫూర్తిగా సేవచేయవలెను.

23. ప్రతిదినము నియమముతో భగవద్ధ్యానము చేయవలెను.

23. వ్యభిచారచర్చ చేయరాదు వినరాదు. ఇట్లు చేయు వారితో కూర్చుండుటయు పనికిరాదు.

24. నిరంతరము భగవన్నామ జపము చేయవలెను. శ్వాసతో చేయుట ఉత్తమము. కామవాసన జాగృతిచెందిన రామాయణ పారాయణము చేయవలెను లేదా నామజపము చేయవలెను.

25. ప్రపంచవైరాగ్యము చెందవలెను. ప్రపంచపు అనిత్యత్వమును తలంపవలెను.

26. స్త్రీలవిషయమునం బురుషులు, పురుషులవిషయమున స్త్రీలు శరీరమందలి దోషములను భావించవలెను. మాంసము, రక్తము, కఫము, నిష్ఠామూత్రములు, ఎముకలగు అపవిత్రపధార్థములపై చర్మము కప్పంబడియున్నదని భావించి పరస్పర రామణీయకతపై హేయభావము చెందవలెను.

27. నెలలో రెండుసార్లు వచ్చు ఏకాదశీ ఉపవాసము చేయవలెను. (వీలైతే నిర్జలోపవాసము మంచిది)

28. మహాపురుషుల యొక్కయు, వీరబ్రహ్మచారుల యొక్కయు చరిత్రలను మననము చేయవలెను.

29. వీలైనంతవఱకు సర్వులలో పరమాత్మభావన చేయవలెను.

30. తన చరమలక్ష్యము భగవత్ప్రాప్తియే యనునది మనస్సునందుంచుకొనవలెను.

## మేలుకొనుము!

అమూల్యమగు మానవజీవిత పరమావధి అగు శాశ్వతానందము (మోక్షము) ను పొందుటకును; లోక కల్యాణము

సిద్ధించుకొరకున్ను ప్రజాసామ్యమున ఆస్తికత, సత్యము, అహింస, శాంతి భక్తిభావన, సేవానిరతి, స్వధర్మనిర్వహణము త్యాగశీలతవృద్ధిపొందుటకొరకున్ను పవిత్రమగు భగవన్నామము ఆశ్రయింపవలెను. కలియుగమున భగవన్నామ స్మరణసులభమై శీఘ్రముగా ఫలము నొసంగునని శాస్త్రములు ఘోషించుటయే గాక, మహనీయు లనేకులు వారి అనుభవముచే ధృవపరచి యున్నారు కావున భగవన్నామము సులభమగు ఇహపరసాధన మని నమ్మి దానిని జపించి స్మరించి లిఖించి, కీర్తించి తరింపుడు.

సర్వసౌఖ్యప్రదమగు యీ భగవన్నామ సంకీర్తన వాయుమండల మంతయు నిండినచో దేశశాంతి గలుగగలదు. కావున ప్రతి గ్రామమునందు సంకీర్తన సంఘములను నెలకొల్ప వలెను. (కనీసము 5గురు సభ్యులతో). ఇందు వారమున కొక సారి సమావేశమై సమష్టిప్రార్థన, సంకీర్తన, సద్గోష్ఠి జరుపవలెను. మీ గ్రామమున భజనసంఘము లోగడ ఏర్పడియున్నచో అందు అందరు ఉత్సాహముతో చేరి భగవన్నామసంకీర్తన గావింప వలెను. ఈ సంఘము లన్నియు కలిసి పనిచేయుటకు ప్రతి సంఘాధికారియు వారి సంఘ వివరములు మాకు తెలియచేయ వలెను. ఈ యుద్యమవ్యాప్తికై ప్రతివారు శక్తికొలది యత్నించ వలెను.

సోదరా !ఆలసింపక భగవన్నామ సంకీర్తన గావింపుము. మీ గ్రామమున సంకీర్తనసంఘమును స్థాపించి మాకు తెలియ పరచుము. దేశకళ్యాణమునకై తోడ్పడుము.

ఇట్లు,

శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము (రిజిష్టర్డు)

శ్రీరామనామక్షేత్రము, గుంటూరు.

# నామ సంకీర్తనము

(సంకీర్తన విధానమును నామమహిమను చక్కగ బోధించు

గ్రంథరాజము)

పత్రికయందలి విషయములు:—

1. జీవితోద్దేశము 2 నామమహిమ 3 నిరంతరాను ష్ఠానము 4 సంసారభారము భగవంతునివంతు – నిష్కామసేవ మనవంతు 5 ఇతర సహకారులు 6 సంఘకీర్తనకు విరోధులు 7 సంఘసాధారణ సంకీర్తన విధానము 8 గాఢసాధన విధానము 9 ఏకాంత సంకీర్తన విధానము 10 నగరసంకీర్తన విధానము 11 నామసప్తాహము 12 భగవన్నామాలంకారములు 13 గృహసంకీర్తన విధానము.

ఇందలి భగవన్నామములు:—

శ్రీ రామనామము శ్రీకృష్ణ. శ్రీశివ. శ్రీపాండురంగ (విఠల్) శ్రీ రామకృష్ణ పరమహంస శ్రీ హరనాథ చైతన్య నామములు గలవు. వెల రు. 1–0–0

## శ్రీ రామ పూజ (పూజాపరులకు ఋజ్యాముల త్రోవ)

మన ఆంధ్రదేశమున శ్రీరామభక్తు లెక్కువ. వారికి శ్రీశ్రీరామ పూజాపద్ధతి పూర్తిగాఁ దెలుపవలెనను నుద్దేశ్యముతో సనాతనమగు శ్రీరామపూజావిధానమందు క్రియలతో సహా పొందుపరుపఁబడినవి. అర్థము తెలియక చేయుట వ్యర్థమగునను నుద్దేశ్యముతో నట్టివారి సౌకర్యార్థమై సులభ గీతపద్యములు వ్రాయబడినవి. ఇందమూల్యమగు పీఠికయు, అందు మానసిక పూజావిధానము శ్రీ సీతా, రాముల అష్టోత్తర శతములు, సహస్రనామములు, మంత్రపుష్పత్రయము, పురుషసూక్తము, శ్రీ సూక్తము, భోసీలా సూక్తము ల.

మన్యుసూక్తము లిందుగలవు. చదివినగాని దీని గొప్పతనము తెలియదు. నిత్యోపయోగమగు గ్రంథరాజము.

క్రౌన్ సైజు చక్కనికూర్పు - వెల ఒకరూపాయి.

## ప్రభాత సేవ

అన్ని కాలములలో ఉషఃకాలము దివ్యమైనది. ప్రకృతి తన జడిమనుండి జాగృతను బొందువేళ. భగవానుని అపార కరుణాకటాక్షము నొందుటకు తగిన సమయము. ఇట్టి మహోత్కృష్టమైన కాలమును వృథాచేయక భగవన్నామ కీర్తనము చేయుట మన కర్తవ్యము. శ్రీరామచంద్రమూర్తివారికి మేలుకొలుపు యిత్యాది సేవలకు తగిన గీతికలు, గద్యపద్య భాగములు, ఇందు గలవు. హిందువుడగు ప్రతి గృహస్థుని యింట నుండదగిన పాత్రము. వెల 0-6-0.

## కలిసంతరణోపనిషత్

(అను కలిసంతరణ మహామంత్ర ప్రభావము)

బ్రహ్మ నారదమహర్షికి సూత్రప్రాయముగ జెప్పిన కలిసంతరణోపనిషత్తులోని రహస్యము లిందువిపులీకరింపబడినవి. మృత్యుంజయము, మోక్షప్రదము, కలిసంతరణము, నగు నీ మహామంత్ర మహాత్మ్యమును వర్ణింపబడిన మహోత్కృష్ట గ్రంథము. వెల 1-0-0.

## దినచర్యాధారము

సాధకుడగు ప్రతివ్యక్తి తన సాధన ఎంతవరకు సఫలీకృతమగుచున్నదో నిత్యము చూచుకొనుచుండుట అత్యావశ్యము. యీ దినచర్య నీ దైనికజీవిత పథములోని తొట్రుపాట్లను ఎప్పటి కప్పుడుచూపుచు నీ సాధనకు మిక్కిలి తోడ్పడ గలదు. పడవనకుచుక్కాని ఎంత అవసరమో సాధనకు దినచర్య అంత ముఖ్యము. వెల 0-0-6.